## నా మాట—

ఆలిండియా రేడియో విజయవాడవారు ఒకసారి నన్ను ఏక పాత్రాభినయానికి పిలిచారు- టెలిగ్రాం వచ్చింది-నాకు బాగా నచ్చినవి, జనం మెచ్చినవి అప్పటివరకూ నాకు వచ్చినవి హరిశ్చంద్రలో నక్షత్రకుడు, చింతామణిలో భవానీ శంకరుడు పాత్రలు. ఈ నా పాత్రలకు విశాఖ రేడియో కేంద్రం వారు నాకు ఎప్పుడో అవకాశంయిచ్చి ప్రసారంచేశారు. ఏంచెయ్యాలి! "బభ్రువాహన"లో బభ్రువాహనుడు, గయోపాఖ్యానంలో నారదుడుకూడా నాకు దేశంలో పేరుతెచ్చిన పాత్రలేగాని ఏకపాత్రలుగా వానికి ఉనికి, మనికిలేదు. మిత్రులు కొండపల్లి భాస్కరరావుగారు ఒకటి వ్రాసెయ్యకూడదా అన్నారు. ఒకపూటంతా ఆలోచించిచూసేను. నేను బి.ఎ.లో అలవోకగా చదివిన తిక్కనగారి అభిమన్యుడు గుర్తొచ్చాడు. నవరసనాయకుడుగా మలచాలని చేసిన ప్రయత్నం నాకే ఆశ్చర్యం కలిగేలా ప్రసన్నమయింది. నిముషాల మీద కాగితంమీద కలంపెట్టిన గంటలో రచన పూర్తయిపోయింది. ఆకాశవాణి విజయవాడ కేంద్రానికెళ్ళి షెడ్యూల్డ్ టైమ్‌కి రికార్డిచ్చాను. వారు 31–7–80వ తేదీన ప్రసారంచేశారు. దానిమీద శ్రోతల ప్రతిస్పందన, వారంరోజుల పాటు వచ్చిన ఉత్తరాలపరంపర నాకు ఎంతో ఆశ్చర్యం కలిగించాయి. కొన్ని ఉత్తరాలు ఆసక్తిపరులకోసం యిందులో పకటిస్తున్నాను మచ్చుకు దీనికి సమీక్షలుగా—

దీనివ్పుస్తకకు కారణమైన-నాటి ఆలిండియా రేడియో ప్రొడ్యూసర్ శ్రీ యం. వీరభద్రరావుగారికి (నేటి సినీహాస్య నటులు సుత్తి వీరభద్రరావుగారు,) వినడమేకాకుండా వంద లాది ఉత్తరాలతో రేడియోస్టేషన్నూ, నన్నూ ఉక్కిరిబిక్కిరి చేసిన అభిమానుల , మిత్రులకీ, అందరికీ నా కృతజ్ఞతలు.

—పడాల రామకృష్ణారెడ్డి M. A.,

## ★ రేడియో అభిమన్యుడు ★

ఈ రోజు రేడియోలో శ్రీరామకృష్ణారెడ్డిగారి వీరాభి మన్యు ఏకపాత్రాభినయం విన్నాం. కాదు కాదు కన్నాం. అంటే ఆఘట్టం చూస్తున్నట్టే అనిపించింది. చిట్టచివర కన్నులు చెమ్మగిల్లాయి. నేనేకాదు విన్నవాళ్ళంతా కన్నీళ్ళు కార్చారు. చాలా బాగుంది. నాకు చాలా సంతోషమైంది.

కె. టి. రావ్

ది. 31-7-80.

ఆకాశవాణి విజయవాడ కేంద్రంనుండి యిప్పుడే ప్రసారమైన మీ వీరాభిమన్య ఆమూలాగ్రంగావిని, అనిర్వచనీ యానందాన్ని పొందాను. మళ్ళీమళ్ళీ వినాలనిపిస్తోంది. వాచకం డెలివరీ (మాడ్యులేషన్) ఎలాగుండాలో అర్థమయింది. ఇంత సుశ్రావ్యంగా శృంగార-వీర-హాస్య-భయానక-బీభత్స అద్భుత-కరుణరసప్రధానమైన వీరాభిమన్య ఏకపాత్రాభినయం వింటున్నంతసేపూ దృశ్యం కంటిముందు జరిగినట్లు భావించాము. అయ్యది తమస్వంతరచనగనుక మీరి పాత్రలో లీనమై తాదాత్మ్యంపొంది నటించారు. మేము తన్మయులమయ్యాము. నేనొక నాటకాల డైరెక్టర్ని అని జ్ఞాపకంవస్తే సిగ్గుకలుగుతోంది. మీరు వెయ్యి కేండిలు పవరు బల్బులాంటివారు. మీముందు, మీవాచక డెలివరీ ప్రభంజనంముందు హోరుగాలిలోని ఆముదందీపంలాంటివాడి నని అర్థం చేసుకున్నాను.

కె. యస్. యన్ రెడ్డి
31-7-80.

మేమందరం మీ వీరాభిమన్య విన్నాం. చాలా చక్కగా వచ్చింది. అన్నికేంద్రాలూ రిలే చేయడంవల్ల చాలా స్పష్టంగా వినగలిగాం. Programme Grand Success చాలా మంది లెక్చరర్స్‌విని నన్ను అభినందించారు. అది నాకు కూడా గర్వమేకదా !

ఇజ్జాడ వెంకటరావు M. A.,
2-8-80.

Heard your Veerabhimanya. Congratulations. We felt very happy.

Your performance as we heard is Superb. We pray god to give good future in this field.

వై. వీరభద్రరావు B. A.,<br>
వి. సత్యనారాయణ B. A, B. L.,<br>
హెచ్. యస్. యల్. నారాయణ

విన్నాం మీ వీరాభిమన్య ఏకపాత్రాభినయము. నిద్రాణమైయున్న నేటి సమాజ పునాదుల స్పందింపజేయుట కిట్టి వీరాభిమన్యులు, బాలచంద్రులు, అల్లూరి సీతారామరాజు గాధలే ఆరాధనీయములు.

రసావిష్ణులగు మీరు రచనయందేగాక ప్రకటించు పద్ధతియందును జూపిన కూర్పు, నేర్పులు హృదయంగమములై శ్రోతల నాకట్టుకున్నవి. చైతన్యవంతమగు మీ కవితాధోరణి సర్వతోముఖాభివృద్ధినందగలదనియు, జాతిని జాగృతపరచగలదనియు ఆశింతును.

డాక్టర్. యన్. బాపిరెడ్డి M.A, PhD.,<br>
1–8–80.

తమ రేడియో ప్రోగ్రాం విన్నాం. చాలా బాగుంది. ముఖ్యంగా ఆడవాళ్ళకు ఎంతో నచ్చింది. కళ్ళనీళ్ళు పెట్టారు.

మిమ్మల్ని అభినందించగలస్థోమత నాకులేదు. అయినా ఆనందాన్ని తెలుపుకుంటున్నా.

కో దం డం
2–8–80

Happy to hear your Radio Programme-Excellent-kindly accept my heart felt Congratulations.

**Y. S. Narasimha Rao**
2–8–80.



# అంకితము

నా అభివృద్ధిని నిత్యం కాంక్షించే ప్రియమిత్రుడు

ఈ ప్రజలకు ఏదో మేలు చేయాలనే నిరంతర

తపస్వి, కార్యశూరుడు

## శ్రీ వై. యస్. నరసింహారావుగారికి

గౌరవ పురస్సరంగా—

**పడాల రామకృష్ణారెడ్డి M.A.,**



# వీ రా భి మ న్యు

(ఏకపాత్రాభినయం)

---

ఉత్తరా ! ఆకొమ్మమీఁది పక్షిజంటలు లలితపల్లవకుసుమకోమలమధురమంజులరాగరసమ్ముదుమధురభాషణముల ఎట్లుకవ్వించుచున్నవో చూడు. ఊఁ ఆ ప్రవహించు సెలయేళ్లు మనగాఢపరిష్వంగనానందసంభరితసౌభాగ్యానురతులై ఉత్తుంగతరంగమృదంగభంగిమలశృంగార రంగమును సిద్ధపరచి సాదరమ్ముగ రమ్మనిఆహ్వానించుచున్నవి. రా ! ఆ పూసెజ్జల పొదరిళ్ళు మన ప్రణయవిహారవినోదవికాస ప్రకాశములకై సురుచిరసుందరవదనారవిందములతో మదనసీమలై ఎదురు చూచుచున్నవి.

రా ... ప్రేయసీ... (ప్రక్కకుచూసి) ఆఁ ! వార్తాహరుడా ! ఇదిగో వచ్చుచున్నాడ (వెళ్ళి వచ్చి) అమ్మగారినుండి అత్యవసరఉత్తరమా ! (చదివి) ఏమీ ! ద్రోణాచార్యులవారు పద్మవ్యూహము పన్నినారా! ఆఁ! ధర్మరాజులవారిని బందీగా పట్టుకొనినారా ! ఎంతమాట ! దానిని నిముషములో భేదించు ప్రచండవిక్రములునాన్నగారు త్రిగర్తేశ్వరుడగుసుశర్మతో పోరుకై సరస్వతీహ్రదప్రాంతమునకు తీసికొనిపోబడిరా ! ... ఇదికూడ ఆచార్యులవారిపన్నుగడయేనన్నమాట — హుఁ

పార్థుడు లేనంతమాత్రమున పాండవసైన్యము నిర్వీర్యమనితలచెను కాబోలు. పార్థుడు లేకున్న పార్థతనయుడు లేడా ? అమ్మా ! భయములేదు ! శత్రుసేనల మదీయ కృపాణమున శరణముగావించి పాండుభూపాలురపరాక్రమప్రతాపముల ప్రపంచమున కెఱిగించెద. రణరంగమున కర్ణికారకేతు అరదంబుమెఱయ కరలాఘవ శరలాఘవ శస్త్రాస్త్ర ప్రయోగంబుల అరిగుండెలనదరగొట్టి రథగజఘంటాతురంగకింకిణీ పదాతి సింహనాదమేదురరోద్భ్రాంతరౌద్రంబున దుర్యోధనదుశ్శాసనకర్ణద్రోణసౌబలసైంధవాదుల దునుమాడి ఆ రక్తముతో రణభూమి నభిషేకించెద. మహార్ణవమున మందరనగచందంబున, కాననంబున దావాగ్నిచందంబున క్రూరకురువంశజనసమాజక్రీడా తాడనంబొనర్చి ప్రళయ కాలధారాధరస్ఫీతి నిర్ఘాతఘటాబీలంబగు కిరణస్ఫురణ దుర్నిరీక్ష్యుండభిమన్యుండని సిద్ధసాధ్యయక్షకిన్నరకింపురు షాదులుకొనియాడ శత్రుశిరములదండగాగ్రుచ్చి రణప్రాంగణమలంకరించెద. వార్తాహరా ! అవక్రపరాక్రమవిక్రమ శౌర్యసాహసములతో శత్రుశిరములచీల్చిచెండాడి విజయుడనై వచ్చి అమ్మగారిపాదములకభివాదముసలిపెదననిచెప్పు. సుమిత్రుని వెంటనేరథమునాయత్తము చేసికొనిరమ్మను. పోమ్ము ... వీరతిలకముదిద్ది దీవించిపంపుదేవీ యిదే వచ్చుచున్నాడ. [నిష్క్రమణ]

రోషముతో ప్రవేశించి ఓరోరి పారుబోతులారా! పిరికిపందలై కాలికొలది అట్లుపరుగులు తీసెదరేమిరా? అవ్వ! మీపౌరుషములేమయ్యె? యుద్ధరంగమున వెన్నుచూపి పారిపోవుటకు కురుసేనకు సిగ్గులేదా? ఓరీదుశ్శాసనా! ఎక్కడికిరా తేరుదుమికిపారిపోయెదవు? నానిశాతబాణాఘాతముల తప్పించుకొనుట నీ తరముకాదు. ఇదిగో యీబాణముతో నీప్రాణముసరి. కాచుకో-ఆఁ! ఎవరది? విను-చూ యుధిష్ఠిరులవారా! పెదనాన్నా క్షేమమేగదా! ఏమీ! వీని వక్షమునుచీల్చి, ఆ వెచ్చనినెత్తురుతలకురాసిద్రౌపతి కురులుముడుతునని భీమసేనుడు శపథము చేసినాడా? నిట్టూర్పుతో అన్నా! సిద్ధాన్నము విడిచివేయవలసివచ్చినదిగదా! హుఁ... దుష్టుడా! పెదనాయనగారిఆదేశము నీ ప్రాణముల కాపాడినది—పొమ్ము.

ఓహో అంగరాజుగారా! మీ నంగినంగి నాటకములు కట్టిపెట్టి బయటకురండు-మీకొరకే ఎదురుచూచుచుంటి. ఇదిగో యీబాణముతో భువికి నీ ఋణము తీరిపోయినది. కాచుకొమ్ము. ఆఁ! ఏమి! ఈతనికూడా విడువవలెనా? పార్థుడీతనిచంపెదనని ప్రతినజేసియున్నాడా? ఇష్-అబ్బా ... ఇంక నేనెవరితోపోరవలె? ఓ కౌరవవాహినీపతులారా! ఇక యీవంతుమీకుతప్పదు-నా అమోఘాస్త్రమిదేవిడుచుచున్నాడ - చవిచూడుడు.. హహహా హాహాహా ... బృహద్బలా! చచ్చితివా? ఓ నలరుక్మరథులారా! తీరినదా మీ తెగనీల్గు? పాపము కృపాచార్యులవారేమి మూర్ఛనొందితిరా? హహహా హాహాహా ...

ఆహా ! . . . అనుగో లక్ష్మణకుమారుడు! వచ్చితివా తమ్ముడా ! రా- మరిడంబాలుపలుకుటకాదురాయుద్ధమనగా. ఇదిగో-కాసికో-ఏమిటి ? నాతో యుద్ధముచేయుట నీకు చిన్నతనమా ! ఏడికావ్. నీ చవటప్రలాపములుకట్టిపెట్టి యీ బాణముతో యమపురికరుగు. ఊఁ . . . అని బాణము విడుచును హాహాహా . . . చచ్చితివా ! . . .

ఓ . . . ! శత్రుంజయ చంద్రకేతు సువర్చన సూర్యభాను మేఘవేగులా ? చెనటియైన దుర్యోధనుని దుష్ప్రేరణతో మోరగాసుకుని రాజుకు బాసటగావచ్చుచున్నారా ? మంచిది-పెండు రండు. మీ తీటకూడా తీరగలదు. ఇదుగో సౌభద్రుడు, పాండుపౌత్రుడు ధనంజయకుమారకిశోరము, వీరబెబ్బులి లంఘించుచున్నది-కాచుకొనుడు-ఆఁ-దుర్యోధను డేదో నన్నే ఉద్దేశించి పలుకుచున్నట్టున్నాడు ! ఏమిటి-కురుసేన అజేయమైనదా ? నన్నుచంపుటకు చేతులురాకున్నవా ? యుద్ధరంగమువీడి నేను అంతఃపురముచేరి ఉత్తరతో హాయిగా బ్రతుకవలెనా ? హాహాహా పెదనాన్నా! మీ అభిమానమునకు నాఅభివాదములు-దుర్యోధనసార్వభౌములవారేనా యీ పలుకులుపలుకుచున్నది ! హుఁ-కురుసేన ఎంతగొప్పదైనా భయపడిపారిపోవు ఆడారివాడుకాడీ అభిమన్యుడు-చేవగలిగిన చేయి కలుపు-రా- వెనుక అఱపు వినిపిస్తుంది ఆఁ సుమిత్రా ! . . ఇదా మీ ఎత్తుగడ! రణనియమములుకూడ ఉల్లంఘించి నారథసూతుని చంపితివా కృపాచార్యా ! ఏ శాస్త్రమున చదివితి

వయ్యాయియాదుస్తం తము ! ఛీ-కడుపుకక్కుర్తికై ఎంత నీచమునకుపాల్పడితివి? నీ ఆచార్యత్వమునకే మచ్చదెచ్చు కొంటివే! కన్నీటితో హా సుమిత్రా! మిత్రునిగా, ఆప్తునిగా, రధసారథివై నన్ననవరతము కంటికి రెప్పలా చూసుకున్న నేస్తమా! నేటితో నీకూ నాకూ ఋణము చెల్లినదా? (అనికన్నీరుతుడుచుకొని) సరి-ఇదివిచారించుసమయముకాదు.

అఁ-కర్ణా! ఛీ . . . ఇదా మీకుతంత్రము ? దొంగ చాటుగా కార్ముకమును త్రుంచి వీరశూరకర్ణుడను మాటకే కళంకము తెచ్చుకొంటివే! హుఁ వీరశూరకర్ణుడవుకాదు-ఘోరభీరకర్ణుడవన్నమాట - చేవకలిగిన ఎదురునిలిచిబరిమీద పోరవలెగాని యీనపుంసకవర్తనమేలనయ్యా?

ఆరే! శల్యా! కేతువునుదునిమి నారధాశ్వముల వధించితివా?ఏమికురురాజా! అరిధుని నిరాయుధునిచేసి శస్త్రాస్త్రముల కురిపించదలచిన మీ దురాగతము వీరలక్షణమా? ఏమది! అందరూ ఎందుకట్లు పరుగిడివచ్చుచున్నారు? అందరొక్కమారుగా మీదపడిమోదవలెననా?

ఓరీ నయవంచకులారా! ఇదేనా ధర్మయుద్ధము? ఇదేనా కురుక్షాత్రము? అశ్వముల వధించి, సూతునికూల్చి విరధునిచేసి, కపటముతో నిరాయుధునిగావించి అందరొక్కుమ్మడిగా ఒక్కనిచంపబూనుటకూడాయుద్ధతంత్రమేనా ? అంతకంటే .. అంతకంటే .. శిబిరములో నిశి నిద్రించుచున్న

వారినిచంపుట సులువుకదా ! ఛీ ఏమయ్యేరామీ పరాక్ర మములు ? నా చేతికి... నా చేతి కొక్క ఆయుధమిచ్చి ఎదురు నిలువుడిరా-మిమ్మొక్కొక్కరనుక్కడగించి మీపాపము లకు పరిహారముగా యమపురికేగుమతిచేసెదనురా-దుర్మార్గు లారా ! మీకు . . . మీకు . . . పాపపుణ్యవివక్షతలేదు- ధర్మాధర్మములు లేవు-న్యాయాన్యాయములులేవు-నీతి లేదు- నియమము లేదు-పచ్చికిరాతకులుమీరు. ఓరీ నరరూపరాక్షసు లారా ! మిమ్ము దేవుడు క్షమించడురా-నా చేతికొక్క ఆయుధ మిచ్చి తలపడుడిరా-

ఈ పీనుగు గుట్టలలో ఏ మహాత్మునిచైనా ఒక్క కృపా ణము దొరుకునేమో వెదకెదగాక - కొంచెమాగి అబ్బా ! ఈ నెత్తుటికొంపిలో కాళ్ళు గ్రుచ్చుకొని పోవుచున్నవే - నా కాళ్ళు యీ రక్తపు మడుగులో కూరుకుపోవుచున్నవే- అడుగు తూగుటలేదు. ఇవుడేదిదారి ? అబ్బా ! పెద్ద కేకతో పడిపోయి ఎవరూ వెనుకనుండి పొడిచినదీ ? ఓరీ సైంధవా ధమా ! నీవా ? . . . ఎంతసిగ్గులేదురానీకు ? నీదీ ... నీదీ... నీదీఒక రాచపుట్టుకేనా ? విరథుని నిరాయుధుని రక్తపుమడు గులో కాళ్ళుకూరుకుపోయిన నిస్సహాయుని వెనుకమాటుగా పొడిచి వీరుడననిచాటుకుంటున్నావా ? ఓరీ కురుదుర్మార్గు లారా ! మీరు చంపగలిగినది ... మీరుచంపగలిగినది... ఒక్క అభిమన్యునిమాత్రమే - కాని యీ వీరునిఒక్కొక్క రక్తకణమునుండి వేలాది వీరాభిమన్యులుద్భవించి మిమ్ము

క్కడగించెదరురా- సింధురాజా ! ఛీ కుక్కా-- వెనుక మాటుగా కాటువేసిన నువ్వా ఒక రాజువేనా ? హుం-రాచ కులానికే కళంకం. (విషాదంతో) అబ్బా! . . అమ్మా ... పవిత్రభారతదేశమా ! నీతో నాకు ఋణము తీరిపోవుచున్న దమ్మా-అరిభయంకరుడైనఅభిమన్యుడు పోరులో ఓడిపోలేదనీ, యుద్ధనీతికి వ్యతిరేకంగా, దుస్తంత్రముతో సైంధవుడు వెనుక మాటుగాయిచ్చిన బల్లెపుపోటుకు మాత్రమే నేలకొరిగినాడని చరిత్రప్రజలకందీయవమ్మా -నావిజయమునకు వేయికన్నులతో ఎదురుచూసేమాయమ్మసుభద్రకు నీ కుమారుడు వీర స్వర్గమలంకరించెననువార్త అందీయవమ్మా -ఏడువారాలనగలు ధరించి నావిజయాగమనానికై గుమ్మములో ఎదురు చూచు చుండు ఉత్తరకు నీభర్త శత్రువులచేతిలోఓడిపోలేదని, సైంధ వుని దొంగచాటుబల్లెపుపోటుకుమాత్రమే నేలకొరిగినాడని, పతిచేతికి కత్తినందించికదనభూమికిపంపినవీరపత్నిగా నీ కీర్తి తరతరాలు చరిత్రలో సువర్ణాక్షరాలతో నిలిచిపోతుందని ఓదార్చవమ్మా. అమ్మకూ నాన్నకూ నా కడసారి నమ స్కార మందీయవమ్మా. అమ్మా...అబ్బా...హాం...
(అని ప్రాణములవిడుచును).

